# వేదమతము

పురాతనకాలమునుండియు నార్యులగ్నియే పరబ్రహ్మమనితలంచి తదు
పాసనాపరులయి యుండిరని నే నిదివఱలో వ్రాసి దానికిఁ దగినకారణంబులు దెలిపి
నాను. ఆర్యులపుడపు డాగమవిధులందు సోమరసపాన మొనర్చుచుండిరనిసైత మిది
వఱలో వ్రాసినాను గాని సోమలతను దైవముగనెంచి దానినిఁ బూజించినట్టియు
దానినిఁ జేయునట్టియు విధులుగల ఋక్కులవిషయము హెచ్చుగ వ్రాయలేదు
అప్పని నిప్పుడొనరించెద ఋగ్వేదములో దొమ్మిదవమండలము సంపూర్ణముగఁ
సోమదైవమును గుఱించినవిషయమేను మిగత మండలములలోసైత మచటనచట
నున్నవి అగ్నియొక్క రసరూపము సోమమని యార్యులనమ్మకము. అగ్నిబలె
నీసోమ దైవమునకుసైత మనేకరూపములు వాసస్థానములు గలవు సోమజన్మ
మీ భూమికాదు అగ్నితేజము సోమలత అగ్ని యనేకకార్యములం దుపయు
పడును సోమలత యొకకార్యమునకే యుపయోగింపఁబడును సోమలతనుడికించి
యగ్నికి బలిగనివేదించి యారాధించువారే యా రసపానమునకు నర్హులు ఇది
యార్య యిరానులతోఁ గూడియుండునపు డపూజ యారంభమయినదని తోఁచు
చున్నది "హోమా" యను నామమున నిరానులాగమ విధులొనరించి యార్యు
బలె సోమపానముఁ జేయుచుండిరి జరదుష్ట్రఋషి యిరానులమతమును బొత్తి
సంస్కరించినను, పురాతనమునుండివచ్చిన యీ సోమపానాగమ విధినిమాత్రము
మార్పఁడాయెను సోమలత యిరానుబలె నార్యులకును బర్వతోద్భవమగులఁ
వరుణుఁడు సూర్యుని నాకాశమందునను నగ్నిని నీటియందును, సోమలతను పర్వ
తమందును నుంచెను. ఆకాశమునుండి మాతరిశ్వుఁడు దెచ్చి పర్వతముపై నుంచెన
గరుత్మంతుఁడు పర్వతమునుండి తెచ్చెను ఈలత కేవల శీతప్రదేశమునందు పుట్టును
గాని యెండవేడిమిగల దేశమునఁబుట్టదు ఆర్యులు కశ్మీరమువదలి పంజాబు చేరి
పిదపఁ గాశ్మీర గాంధారదేశములందుండు బేహారులు సోమలతతో వ్యాపారవ
సేయుచు ధనమార్జించుచుండిరి అట్టివారనార్యులు వారిని నార్యులు తుచ్ఛము
జూచుచుండిరి సోమలతనుండి రసముదించు క్రమము ఋగ్వేదమునందనేక ఋక్కు
లలో నుండినను నప్పటివేదభాష స్పష్టముగఁ దెలియదు బ్రాహ్మణములలో
విషయము వివరింపబడినది ఋక్కులు వ్రాయకమునుపు సోమలతను దెచ్చు
విధమును దానినిఁ జేయువిధము నించుక వ్రాసెద.

సోమలతల నధికమాసములలోఁ గొనుటవిధి కావుననే యా మాస
మును సోమలతల నమ్ము వారును నింద్యులైరని తైత్తిరీయ బ్రాహ్మణములోఁ

బలుకఁబడినది దీనిచిత్రమేమో తెలియకయున్నది మూఁడుసంవత్సరముల కొకతూరి వచ్చు నధికమాసములో సోమలత కొనవలెనని యాగాదులు మూఁడువత్సరముల కొకతూరి యొనరింపవలెనని యర్థమా? కాదేని నధికమాసములోఁ గొనియుంచిన లత నెల్లకాలము యాగాదులం దుపయోగింపవలెనని యర్థమా తెలియకయున్నది

సోమలతలు వేళ్లతో సహితముగ బర్వతములనుండి వెన్నెలకాలముఁ బెల్లగించి పోగు జేసి బండ్లమీదనుంచి మేకపోతులతో నీడ్చుకొని యాగశాలకుఁ దెచ్చుచుండిరి సోమలతలుంపను యాగశాలలో నొకభాగము శుద్ధిపఱచి గడ్డిని చిన్నచిన్న కొమ్మలును పఱచి, దానిపై లతలుంతురు పిదప బ్రాహ్మణులు రెండు ఱాళ్లచే నాలతల నదుముదురు రసమును నదుమఁబడిన యాకులును శోధించుటకుఁ గాను చిక్కని ( Fine ) కంబడిలోఁ బడవైచి యంగుళములతోఁ గలుపుచ, మఱల శోధింప రసమంతయుఁ గ్రిందనుంప బడిన పాత్రలో దిగును పిదప రసములో బాలును పులిమజ్జిగయును పెఱుగు మొదలగునవికలపి, యందున గోదుమ గాని మఱియెద్దియైనను బండికోచముగఁ జేర్చి యుడుకఁబెట్టుదురు అది చక్కఁగ నుడికి, యావిరికలిగినంతనె, దానినిఁదీయుదురు ఈ రసము దినమునుమూఁడుతూర్లు బ్రాహ్మణులకు నిత్తురు దైవములునైత మీ పానీయము మెచ్చుచుందురు దానిని ద్రావినంతనె యానందరసమగ్నులయి బ్రాహ్మణులు మైకమందుచుండిరి ఈరసము శారీరశుద్ధికిముఖ్యము ప్రాణాధారమగు జలమిది మనుజునకు నారోగ్యము నమరత్వత నిచ్చునట్టియు స్వర్గమునకు మార్గముఁ జూపునట్టియు శాత్రవులఁ జంపునట్టియు వస్తువిది ఈ రసముఁద్రావ నర్హులు గొందఱేను యాగ పురోహితులుదప్ప మిగత వారు దానినిఁగోరిరేని నట్టివారు తమసరస మూఁడేడ్లకు దగినంతబత్తెమున్నదని స్థాపింపవలెను ఇది ద్రావినవారు దైవములేతామని యెన్ని యనేకవిధములఁ బ్రల్లదము లాడుచుందురు,

**M 10 119** వ సూక్తమిందులకు దృష్టాంతము పైసూక్తము నేనిదివరలో వ్రాసినాను కావున మఱలవ్రాయుట యనావశ్యకము పైసూక్తవర్ణన హెచ్చుగఁ ద్రావినవారి విషయము సామాన్యముగఁ ద్రావినవారు, చక్కఁగ మాటలాడుచుండిరి "ఏమీతెలియని మా హృదయములో సోమ్మువము ప్రవేశించినాఁడు' 'సోమా! అగ్నిబలె మా తేజమును హెచ్చింపుము" "సూర్యుఁడు దినమువుట్టురీతి మా యాయువును హెచ్చింపుము" "మాబుద్ధి నీవలనఁ గుశలతఁగనినది' "నీవు మా యంగములందెల్ల నిండినావు," "రోగములెల్ల శక్తిహీనతచేఁ బలుగిరెను" "శక్తిగ

సోమరసము మాయందున్నది కావున మాయాయువు హెచ్చినది ఇట్టి మాటలు హెచ్చరికతో మాటలాడుచుండిరి అయినను నా రసపానముచేఁ దమకు సైతము దేవత్వము వచ్చునని యార్యులు నమ్మియుండిరి దేవతల కమృతమురీతి సోమరసము తమకు నమర్త్యతయు నసమానశక్తియు నిచ్చునని తలంచిరి

చంద్రకిరణముల యార్ద్రిత సోమలతలోఁ బ్రవేశించి యమృతము నించునని యార్యులు సంపూర్ణముగ నమ్మిరి తాపార్ద్రి సంయోగగుణము సృష్టికారణమని నే నింతకుమున్ను వ్రాసినాను తాపము సూర్యరూపము ఆర్ద్రిత చంద్రరూపము. సూర్యచంద్రులిరువు రగ్నిస్వరూపములేను నీటియందగ్ని యుండును నీటియార్ద్రితయే సోమరూపము.

ఆర్యులు ప్రకృతిసాంబంధిక శక్తులను వానిమహిమలును జూచి వానికి దైవములని పేరిడి, గౌరవించుచుండిరని నేనుపలుమాఱు పలికినాను అట్టి పురాతనార్యులు సోమలతయందలి రసపానమునఁ దమకేద్దియో విచిత్రశక్తి కలిగినది ప్రారంభమునఁ జూచి యదివస్తుగుణమని తెలియక దానికి దైవశక్తినారోపించిరి ఇది యార్యుల సహజగుణము ఎప్పుడు దానిపానమున మనుజుఁడు తనసహజశక్తికంటెను హెచ్చుకార్య మొనరించినచో నా రసమందేద్దియో దైవశక్తియున్నదను నమ్మిక స్థిరపడెను అది త్రావినప్పుడా దైవశక్తి తమలోఁ బ్రవేశించినదని నమ్మిరి కావున సోమలతకుఁ బూజ్యతఁ గలుగుటయగాక దానిరసమునుదీయు వస్తువులెల్లను గౌరవమందెను ఈ సోమరసము దేవప్రియము కావుననే దైవములెల్ల నీరసమునందుఁ బ్రాముఖ్యతవహింప వాదులాడిరనియు పందెములో గాలి గెలిచినందున వాయువునకుఁ బ్రారంభబలియనియు నింద్రునకు రెండవబలిగను నిర్ధరింపఁబడెనని యైతరీయ బ్రాహ్మణములోఁ దెలుపఁబడినది ఈ పానమునుండి నగ్నులకు వస్త్రములువచ్చును రోగములు గుణమగును గ్రుడ్డివారికి దృష్టివచ్చును కుంటివారు నడతురు అనగా సోమపానమొనర్చిన వారారీతిగఁ దామయినట్లు తలఁచుచుండిరి ఈరసము దైవములకు సైతము నిర్జరత్వమిచ్చినది దీనికిఁ బవమానమని మఱియొక నామము

9 113 (7) పవమానా! నశింపక యెల్లకాలము స్థిరముగనుండునట్టియు యశప్రకాశములు శాశ్వతముగ నుండునట్టియు లోకమునందు నన్నుంచుము

9 18 (1) సోమా! నీవు పర్వతములపై వసింతువు
8 2 (2) జనులచేఁ గడుగంబడి, ఱాళ్లచే నొత్తంబడి, ఒంబళిమున శోధింపఁబడి, ప్రవాహామువముఁగి లేచిన గుఱ్ఱముబలె నుందువు
8 48 (1) రుచ్యమగు సోమరసమును నేను సేవించినపుడు నాకు దైవభక్తి కుదురును ధనముదొరకును మర్త్యులు నమర్త్యులు నది తమ యాహారమని దానిచుట్టును జేరుదురు
9 64 (20) సోమా! శుద్ధపఱచఁబడి నీవు సహస్రాధికముగ మాకు వాక్సిద్ధి గలిగించి బుక్కులొనరించులాగున జేసెదవు
9 63 (7) ఋషులతోను వారిస్తుతి ప్రార్థనలతోను, బదుగు ర...వారితోను నీ వలంకరింపఁబడి, యుడుకుచు మాకు మిత్రముగనుండి, మావలన నెత్తంబడి, దైవస్తుతులచేఁ గొనియాడంబడి, కంబళిమునుండి జాఱి, శాత్రవధనమార్జింప శక్తినిచ్చుచున్నావు
9 114 (3) సప్తలోకములకు, సప్తాదిత్యులున్నవారు సప్తఋషు లున్నవారు ఆదిత్యు లేడుగు రేను వీరితోఁగూడి సోమదైవమా! ఇంద్రునికొఱకుఁ బ్రవహింపుము
8 68 (2) బయలుగనుండు దానినిఁ గప్పెదవు రోగములకు మందిచ్చెదవు గుడ్డివాఁడుచూచును కుంటివాఁడు నడచును

పై రీతిగ సోమరసపానమునుండి యాగాదులందు బ్రాహ్మణము (మంత్రము) లుచ్చరించి బ్రాహ్మణులకు దైవశక్తివచ్చినట్టు తోఁచుచుండినందున వారీ సోమరసమునకు దేవత్వమారోపించి పూజించుచుండిరి

పైన వివరించిన యార్యుల ముఖ్యదైవములుగాక, మఱికొన్ని దైవములు గలవు. వారివిషయము ముందువ్రాసెదను

ఆర్యులు ప్రకృతిసాంబంధిక శక్తులను (Powers of Nature) మూఁడు విధములుగ విభజించిరి

(1) సృష్టిశక్తి. ( Creating Energy )
(2) రక్షణాశక్తి ( Sustaining Energy )
(3) లయశక్తి ( Destroying Energy )

సృష్టిశక్తికి భూతకోటిని సృజించుకార్యము, ముఖ్యమయినను మిగత రెండుశక్తుల సామర్థ్యమును దానికిఁగలదు. మిగతశక్తులకు నదేరీతిగ సామర్థ్య

ములు గలవు ఈ శక్తులు, "అగ్ని వరుణేంద్రాదిత్య భూమ్యాకాశములును వాయు
సోమలతలు సోమలతకు గౌరవము దానిరసపానముచేఁ గలిగినదికాని యది
యొక్క ప్రకృతి సాంబంధి శక్తియని నే నమ్మెను సృష్టిస్థితిలయ కారకులగు పై
దైవముల నార్యులు కొంతకాలమునకు వదలి యా దైవములకే వేఱునామములిచ్చి,
బ్రహ్మ, విష్ణు మహేశ్వరులని పిలువసాగిరికాని శక్తులవియేను వానినిమించిన
శక్తులెవ్వియునులేవు ఇంక మన పౌరాణికగాథలు పాండిత్యఫలములు రహస్యార్థ
ఘనులు బాహ్యార్థాభిరుచిచే పామరజన పరిణామములు సర్వదేశీయులకు సామా
న్యముగ నిట్టిగాథలున్నవి ఆ గథలు సైతము చక్కఁగఁ బరిశోధించినచోఁ నైన
నేఁ బలికినదియు సారాంశముగను బ్రహ్మమును గుఱించిన విషయ మీవిచారమునకు
సంబంధించదు ఆ విచారమే వేఱు ఆ విచారమునందు దీశక్తులవిషయ ముపవాద
ముగనుండునుగాని ముఖ్యవిషయముగనుండదు ఈ విషయమునెల్ల జను లాలో
చించినయెడల నిపుడు తమకుఁగల యనేకదురభిప్రాయములును మతవైషమ్యా
ములునుమాని పురాతనార్యులబలె సుఖముగ జీవింతురు

పై శక్తులను నార్యులు దైవములుగ గౌరవించుచుండినదియగాక మఱి
కొన్ని దైవములను సైతము పూజించుచుండిరి ఆ దైవములు ముఖ్యదైవములకు
నుపశక్తులయి ముఖ్యశక్తుల సామర్థ్యములను జూపుచుండును కావుననే యా
ర్యులు ముఖ్యదైవములకు నుపయోగించిన విశేషణములును బిరుదులును నుప
శక్తులకుసైత ముపయోగించుచు వచ్చినారు దీనినిఁ జక్కఁగఁ దెలియలేక యార్యులు
చూచినవస్తువులనెల్లను దైవములుగఁ బూజించువారని యన్యమతమువారు హేళన
మొనర్చెదరు ఇది యొక దృష్టాంతపూర్వకముగఁ జూపఁదగిన విషయము మన మ
నేలు చక్రవర్తియొకఁడు అతఁడెందున్నవాఁడో యనేకులకుఁ దెలియదు అతని
యధికార మతఁడొక్కఁడే నడపఁడు అతనిచేతిక్రింద ననేకులుండి యతని యధి
కారము నెఱవేర్తురు దైవవిషయమున మనుష్యుల దృష్టాంత మన్నిటబోలదని
నాకుఁ దెలిసియుండినను వేఱొకవిధమగు దృష్టాంతము దొరకనందున పై దృష్టాంత
మిచ్చినాను ముఖ్యశక్తియగ్ని అదియే ముఖ్యదైవము అతని యధికారమగు తేజ
మును సర్వప్రపంచమందును వ్యాపింపఁజేయుటకు నాదిత్యు లనేకులేర్పడిరి సోమ
లతయం దాయగ్నిగుణమునే యారోపించినారు ఇంద్రునకు మరుత్తుల సాహాయ్య
ముండుటచే వర్షము దేశదేశము వ్యాపించును మేఘములు విచ్చికొనును ఈరీతి
నే సకలశక్తుల వ్యాపారము, ఋగ్వేదమును జక్కఁగబరిశోధించి యీ విషయముఁ

దెలియవలెను మనఛాందసులరీతి శ్రీ్రంబలె నోటిచే నేర్చుకొని విమర్శనచేయక
యుండినచో ముందుసైత మనేకానర్థములకుఁ గారణములు ఏర్పడును సర్వాకల్మ
షములు పరిహరించు గుణ మగ్నిఁగలదు సూర్యునకుఁగలదు ఇంద్రునకు గలదు
వాయువునకు గలదు నీటికిఁ గలదు కావున గల్మషపరిహారం ధర్మములుఁ బైశక్తు
లగ్నిరూపములేను ఆర్యులు వాయువు నగ్నిగవర్ణించినచో విచారింపక యది తప్పు
నుట దోషము పురాతనార్యు లెన్నివిషయములు మనమునందుంచుకొని వ్రాయు
చుండిరో మనకుఁదెలియదు కావున ఋక్కులు చదువునప్పుడు మన యావచ్ఛక్తి
నుపయోగించి పురాతనార్యుల మానసమును మనము గుర్తెఱుగవలెను కొన్ని
విషయములలోఁ బొరపడుదుము దానినుండి తప్పేమియునులేదు వేదభాషక్లిష్టము
శబ్దార్థములిపుడు మారినవి ఋక్కులలో నెద్దియైన నొక విచిత్రశబ్ద ముండినచో
నా శబ్దమునకు నిపుడు వాడుకలోనుండు నర్థమునిచ్చి మన మన్వయింతుము
అప్పటికాలమునం దార్యులాశబ్ద మేయర్థమున నుపయోగించిరో మనకుఁదెలి
యదు సాయనాచార్యులు సైతము కొన్నిసమయములందు శబ్దార్థవిచారమునకుఁ
గష్టపడినారు కొందఱు పండితులు వారితో నేకీభవింపక వేఱర్థముచేసినారు
ఇప్పటి పాశ్చాత్యపండితులు మఱియొకయర్థము గల్పించినారు కావునఁ గొన్ని
ఋక్కు లర్థములుకావు

## అశ్వినులు

ఇఁక నుపశక్తులనుగుఱించి వ్రాయఁబూనెదను అశ్వినులనుండి ప్రారం
భించెద

సూర్యుని రథాశ్వములనఁగ నతని సప్తకిరణములు అవి తూర్పుదిక్కున
దూరముగఁ బొడఁజూపనంతనె పుట్టునట్టివి కావున నశ్వినీదేవతలని నామముకలి
గెను ఈ యశ్వినుల రాకవలనఁ బ్రాత కాలము సూచింపఁబడును కావున నుష
స్సులరాకఁ జాటువారని పేరువచ్చెను సూర్యుని రథధ్వజము లశ్వినులని కొన్ని
ఋక్కులందు వర్ణించినారు అశ్వినీదేవతలకు వైద్యులని బిరుదు ఉష కాలమునకు
మున్ను లేచి తమతమ కార్యములందాసక్తులగువారికి రోగములురావని యార్యుల
యభిప్రాయము అశ్వినులగ్నికి మిత్రములని వర్ణింపఁబడినారు అశ్వినులు పొడఁ
జూపినంతనే జనులు తమ యాగవిధులొనర్ప నగ్నినిఁ బ్రజ్వలింపఁ జేయుదురని
యర్థము ఇటులనే యశ్వినులనామముల యుపయోగములు దెలియవలెను అశ్వినీ
దేవతలనామము లనేకఋక్కులం దగపడుటయగాక సూక్తములుసైత మనేకము
లున్నవి. సూర్యుని కొమార్తెయగు సూర్యమనశ్వినులకిచ్చి వివాహముచేసినటులఁ

గొన్ని ఋక్కులున్నవి దీనిరహస్యార్థము సందేహాస్పదముగ నున్నది సూర్యుడు తన ప్రకాశమను గణముగ నశ్వినులకునిచ్చును కావున నల్లునకు మగణమిచ్చెనని కొందఱూహించిరి అశ్వినులొక్కరా యిరువురా యనునది సైతము సందేహముగ నున్నది శబ్దస్వారస్యమున నిరువురని గాదలుపలుకుచున్నవి అశ్వినులన సంధి సమయము లుండునాయని యొక సందేహము కలుగుచున్నది అశ్వినులనియు నుషస్సులనియు కాలమును రెండువిధములుగ విభజించినారు అరుణోదయము లశ్వినులకాలమనియు ప్రాతఃకాల ముషస్సులనియు, మఱల సాయంకాలమందలి సాంధ్యరాగ మశ్వినులకాలమనియు ప్రదోషముషస్సుల కాలమనియు నాకుఁ దోఁచెడు సంజయందలి యశ్వినులు సారమేయములు సంజయందలి యుషస్సు "సరమ" యనియు నామభేదములు సూర్యుడస్తమించినతోడనె పశ్చిమప్రదేశ ముపందరుణోదయమును బిమ్మటఁ బ్రదోషమును సహజముగదా?

అశ్వినులుషస్సులగుఱ్ఱములను దోలువారని సైతము కొన్ని ఋక్కులలో నున్నది ఈ యశ్వినుల విషయమునగల కొన్ని ఋక్కులిచట వ్రాయబూనెద

M 1 3 (1) అశ్వినులారా! పలసుంపత్సమేతులయి ప్రకాశమున కాలవాలమయి చురుకుగల హస్తములతో మీరు మా బలులందుడి

(2) ఆశ్చర్యకరమగు కర్మలొనర్చుచు మాస్తుతులందుచు నుండు నశ్వినులారా! దయాళులయి మాఋక్కులందుఁ

(3) అద్భుతకార్యములొనర్చు నాసత్యులారా! కుశతృణములపై నుంచిన బలులు మీయవి అగ్నిజ్వాలలబలె నెఱ్ఱగనుండు మార్గమున మీరు సంచరించుచున్నవారు

"ఎఱ్ఱనిమార్గమున మీరు సంచరించుచున్నవారనిన" నరుణోదయమున సంచరించువారని యర్థమగును అశ్వినీదేవతలలో నొకనినామము "నాసత్య" యనియు మఱియొకరినామము "దస్ర" యనియు తెలియవచ్చుచున్నది నాసత్య యన, నసత్యమునకు విరుద్ధుడగువాఁడు దస్రయన జెడుగులు చెఱచువాఁడు బహుశా ప్రాతఃకాలము నాసత్యులది సాయంకాలము దస్రులది యుండనగును

1 18 (3) నాసత్యులకు నిరువురికి గాను బలిభువులొక చులుకని రథమును నిర్మించిరి ఆదిసర్వదిశలుఁ దిరుగుచుండును వారమృతమునుబిండు గోవు నుద్భవింపఁ జేసిరి

(4) వారు తమప్రార్థనలచే సదాకాలము నిర్మల హృదయముగలవారయి

నాసత్యు - తలిదండ్రులకు మొదిమిలేనటు లొనర్చిరి

నాసత్యులియవురని యొకటిగేర్పరెను వారి తలిదండ్రులు భూమ్యా కాశము లుండనగునని నే నూహించెద పైన బలుక బడిన ఋభుచరిత్ర ముందు వ్రాయ బూనినాను ఈ యశ్వినీదేవతలను గురించి మఱికొన్నిఋక్కు లిచట లిఖించెద

1 22. (1) అశ్వినీద్వయము తమరథము నుషఃకాలమునను న్నే సిద్ధపఱచికొని మేమిడు సోమరసము సేవింప వత్తురుగాత

(2) స్వర్గమునుజేరు రథిశ్రేష్ఠులైనట్టియు దివ్యరథము నెక్కినట్టియు నశ్వినీయుగ్మమును మేము బిలుచుచున్నాము

1 34 సూక్తములో త్రికాలములందు వచ్చు బలుచునంద నశ్వినీదేవత లాహ్వానింప బడినారు

1 139 (4) అశ్వినీదేవతలారా! మీరుగదా స్వర్గమునుదెలచువారు ప్రాత కాలాగమవిధులందు మీరుంటకుంగాను మీ రథములకు గుఱ్ఱములు కట్టంబడినవి స్వర్ణరథపీఠముపై మిమ్ము గూర్చుండబెట్టితిమి సమీప మార్గమనియు సరియైనమార్గమనియు మీ రంతరిక్షమార్గ మనుసరించితిరి

M 5. 73 (5) సూర్యుడు మీ రథమెక్కినపుడు మీరథము వేగముగంబోవును ఎఱ్ఱనిపక్షులు మీచుట్టునుండును భూరిజ్వాలలు మిమ్ముగప్పును

పై ఋక్కులో సైతం మశ్వినులు సాంధ్యరాగములు వ్యాపించు కాలమునవే వత్తురనునది స్థిరపడును ఇటులనే యనేకఋక్కులున్నవి ఈ యశ్వినీదేవతలు దేవవైద్యులనియు వీ రొనరించినశాస్త్రమే ప్రపంచమున వైద్యశాస్త్రముగ నేర్పడిన దన్నియు ప్రసిద్ధి అశ్వినులు సదాయౌవనవంతులు రూపవంతులు అనేకరూపములు ధరింప సామర్థ్యముగలవారు గరుత్మంతునిబలె వేగగమనముం గలవారు స్వర్ణ రథమునకు గుఱ్ఱములనైనను బక్షులనైనను గట్టి యాకాశమార్గమున నడచుచుండురు. సాంధ్యరాగములను మహత్సబద్ధములుగ నొనరించి పురుషదైవములుగ నుతించినారు ఆశ్వరూపముగ దాచికొనిన సూర్యునిభార్యయగు సంజ్ఞాదేవిని సూర్యుడశ్వరూపముగ గూడినందున నశ్వినులు పుట్టిరని గాధలువన్నినారు సంజ్ఞయన నాకాశము అచట సూర్యుడరుణరూపమున గనపడినతోడనె యశ్వినులుపుట్టిరని యర్థము, అశ్వినులవయస్సు రూపము, ప్రకాశము వేగగమనము,

ద్విరూపము, రోగనివారకగుణము, పరోపకారబుద్ధి యీగుణములెల్ల ఋగ్వేదము నందు వర్ణింపబడినవి అశ్వినులు దివ్యవైద్యులు కావున విషజలములోను నూతి గుండములోను బడిన, రేభవందన, కణ్వ యంతక, ఋజ్యా, కర్కంధు, వాయ్యా, సుచాంటి అత్రి, పురుకుత్స, ప్రశ్నిగ్వ, చ్యవనుడును వారివారి బాధలనుండి రక్షించిరని యనేకఋక్కులలో సూచింపబడినది అశ్వినులు చ్యవనుని యౌవన వంతుని జేసి సోమపానార్హులైన గాథ ఋషు లనుశీర్షిక క్రింద వ్రాయబడినది చూడనగును

ఇంక నుషస్సులనుగురించి ఋగ్వేదమున ఋక్కులనేకములున్నవి ఈ దేవతకు గ్రీకుదేశములో "ఇయాస్ (Eos) యనియు రోం దేశములో "అరోర' యనియు నామములు ఈ దేవతలనుగురించి యనేక ఋక్కులేగాక సూక్తము లున్నవి ఆర్యులదేవతారాధన యుషఃకాలమునం బ్రారంభమగు కతంబున నా రీతి బ్రార్థింపబడినది ప్రాతఃకాలమున నార్యులు లేచినక్షణముననే యుషస్సె ల్లెడల గనిపడుచుండెను దినమువచ్చునని వారిహృదయ మానంద వారిధిలో మునుంగుచుండెను కావున నీ దేవతనుగురించిన ఋగ్వేదఋక్కు లతిమనోహర ములుగను నత్యలంకార సహితములుగను నున్నవి తళతళమని ప్రకాశించు వస్త్ర ములను ధరించిన కన్యయనియును తనసోదరియగు నంధకారమునుం బారద్రోలున దనియు సూర్యునిమార్గము చక్క బెట్టునదనియు యాగమవిధులకాలము చాటున దనియు నిద్రనుండి జీవకోటిని లేపునదనియు కనులుగానరానివానికి దృష్టి నిచ్చున దనియు కుంటివానికి బలమిచ్చునదనియు వర్ణింపబడినది అయినను నా దేవతరాకకు సంతసించుచు స్తుతించువారు చనిపోవుటయు, దినమురాకచే గ్లుప్తాయువుకు నొక దినంబు తగ్గుటయునుజూచి కొన్నిసమయములందా దేవతయొక్క రాకకు దుఃఖించు చుండిరి ఈ యుషస్సు స్వర్గమునకుం గొమార్తెయనియును సూర్యునిచే మోహింపం బడి వానికింజిక్క క తప్పించుకొను చున్నదనియును ఋషులు వర్ణించినారు

M 1 124 (1) అగ్నిని రాజిల్లంజేయంగనె, సూర్యుండుదయింపంగనె యుషస్సు తన్ప్రకాశమెల్లెడ వ్యాపింపంజేయును

(2) దైవికములగు ఋతువిధుల ననుసరించి యాయు కాలము తగ్గించి నను నంత్యములేక గతించిన ప్రాతఃకాలములకుం దుదియై, రాంబోవు వేకువలకు మొదలయి యీప్రాతఃకాలము ప్రకాశించుచున్నది

(3) అల్లదిగో పూర్వ దిశను నాకాశ రాజుబిడ్డ యుషస్సు ప్రకాశమను వస్త్రమును ధరించుకొని నగపడుచున్నది వైవిధ్యముగు ఋతుమార్గమున సంచరించుచున్నది దిశలెల్ల నెఱింగినది కాని దారిచెప్పదు

(4) ఆకాశ దేవతయెద, సమీపమున నగపడుచున్నది క్రొత్తపాటను పాడువానివలె మనోహరములగు వస్తువులను జూపుచున్నది నిద్రబోవువారిని లేప నీగవలె వచ్చుచున్నది దేవతలలో నిజమయినట్టియు మార్పులేనట్టియు దేవతయిది

(5) మేఘసముద్రములో బూర్వార్ధమున గిరణగోవులతల్లి తన చిహ్నమును జూపుచున్నది వెడల్పుగ వ్యాపించుచు దనతల్లిదండ్రుల తొడలనెల్ల నిండుచున్నవి

(6) అతివిశాలముగ వ్యాపించిన తనప్రకాశమును, తన బాహువులను వలె క్రొత్తవారికిని సమముగ నిచ్చుచున్నది ఆ దేవత యత్యధికముగ ప్రకాశించుచు దన యంగసౌందర్యమునకు గర్వించుచున్నను బీదవారిని జూచికాని గొప్పవారిని జూచిగాని మరలదు

(7) ఆ దేవత తనరథము నెక్కి, సోదరుడులేని యువతి తననాన్నవద్దకు వెడలినటుల మనుజుల నరయబోవుచున్నది ఉషస్సను యువతి, యలంకారయుతయయి, చిరునగవునగుచు దనభర్తను ప్రేమించుచుపోవు స్త్రీవలె దనసౌందర్యమెల్లనిప్పి చూపుచున్నది

(8) అక్కయొక్క రకమునుగని, చెల్లెలు తనతావు విడలుచున్నది ఆపు డక్క తన సౌందర్యమంతయును జూప నలంకృతయయి, సూర్యకిరణములతో ప్రకాశించుచు, నుత్సవకాలములందు స్త్రీలు సభలకుబోవురీతిని బోవుచున్నది

(11) తూర్పుదిశనుండి, యీ వచ్చినది, మనపై దనదయ జూపినది ప్రకాశించు నెఱ్ఱయెద్దులకు జీనులువేసినది

(12) గూళ్లువదలి పక్షులు వెడలిపోవునటుల, నీ యుదయమున జను లాహారార్జనమునకునై వెడలెదరు etc

ఆ పెహూరాత్రము లిరువురక్కచెల్లెండ్రనియును నాకాశరాజు కూతురు అనియును నిరువురు పరోపకారులనియును నిరువురు స్వాగతార్హులనియును దమతమ కాలములందు జనులకు మేలుసేయువారనియును వరుణుని ఋతువిధులకు విధేయ

లగువారనియు వర్ణింపఁబడినారు ఇచటరాత్రులు మానవశత్రువులుగ బలుకఁబడలేదు దయాళువగు మిత్రమనియు చల్లఁదనమును విశ్రాంతియు నిచ్చునట్టిది యనియు, మెత్తనితల్లిగ నలసటఁదీర్చుచు నూఱడించునదనియు తెలుపఁబడినది ఈ యిరువు రక్కచెల్లెండ్రును చక్కని నేతపని నేర్చినవారు వారు సదావస్త్రములను నేయుచుందురు ఉషస్సు బంగారు దారముతోను, రాత్రి, నల్లనిదారముతోను వస్త్రములను నేయుదురు ఒకతె నేసిన దానిని నేతపనిఁ జెఱచుచుండును ఉషస్సు కాశమున బొడఁజూపినమాత్రనె చెల్లెలునేసిన యంధకారము చెడిపోవును అపుడే సూర్యుడు వెంబడించి యంధకారమనెడ చర్మమును జుట్టివేయును అటులనే, రాత్రి యుషస్సు నేసిన తెల్లనివస్త్రమునుజుట్టి యంధకారమను నల్లనివస్త్రము నేయును అక్కచెల్లెండ్రిరువు రిచెడుగుపనిని నిర్విరోధముగఁ జేయుచుందురు అహోరాత్రము లక్కచెల్లెండ్రుగ నుండినను నొరినొకరు పొటఁదోలుచుందురు వీరిరువురిలో నెవరు పెద్ద యెవరుచిన్న యనునది తెలియక యొకఋషి ప్రశ్నించి నాఁడు ఉషస్సునకు సూర్యునితో గల బాంధవ్యము సహజముగనుండినను, గొన్ని తావులందు భిన్నించుచున్నది ఉషస్సు తన్ను మోహించిన సూర్యకిరణవ్యాప్తిచే మోఱయుచున్నది యువతివెంట వంటిన యువానునిమాడ్కి సూర్యుఁడుషస్సును వెంబడించుచుండును అయినను నదివానిచేతికి దొరకదు సూర్యుఁడు దానినిఁ జేరఁ జాలడు ఒక ఋషి యుషస్సునుగుఱించి పలుకుటలో "ఆలసింపక పఱుగిడుము దొంగబలెగాని శత్రువువలెఁగాని సూర్యుఁడు నిన్నుఁబట్టి కాల్చివేయునని" పలికినాడు మఱియొకచోట నుషస్సు ప్రకాశించుగోవనియు సూర్యుఁడు దాని దూడయనియు వర్ణించినారు రాత్రియనునది యంధకారయుతమగు గుఱ్ఱపుశాల యనియు ప్రకాశాశ్వములు దానిలోనుండుననియు యుషస్సు దానివాకిలిఁ దెఱచు ననియు వర్ణింపఁబడినది ఋషులు మేఘములనావులుగను గుఱ్ఱములుగను వర్ణించు చుందురు అటులనే సూర్యునిసైతము పోల్చుచుందురు మేఘములను గొఱ్ఱెలుగను నుషస్సును గొల్లదిగను వర్ణించినారు అహోరాత్రములు రెండును రెండావు లనియు వాని పొదుగులలోనుండి రెండురంగుల - పాలుపిదుకుచుండుననియు యింద్రుఁడు నల్లావువందు నల్లపాలుంచెననియు తెల్లావునందు తెల్లపాలుంచెననియు వర్ణింపఁబడినవి ఆవులు మేఘములకును, ఫాలాకాశములకును ఋషులు పోల్చు చుందురు ఉషస్సు సంపన్నురాలనియు ప్రాత కాలమునఁ- దనస్వర్ణసంపదఁ జూపు ననియు పలుకఁబడినది ఈసంపదను చెల్లెలగు రాత్రి దాఁచియుంచును దాఁచిన ధనమును నక్క ప్రాతఃకాలముననే తీసికొనుచు ప్రతిగృహమునకును బోయి

యింటివారిని నిద్రలేపి వారిని దమతమ పనులకు బంపి ఋజుమార్గమున వారినిఁ బ్రవర్తింప జేసి పోషించును

పైన నాచే బలుకఁబడిన నియమములకెల్ల నాధారములుగ ఋక్కు-లున్నవి ఋగ్వేదమునందెల్ల నుషస్సునుగూర్చిన యుక్కు- లతిమనోహరములుగ నున్నవని యనేకుల యభిప్రాయముతో నే నేకీభవించుచున్నాను కొన్ని ఋక్కు-లిచట దృష్టాంతములుగ వ్రాయుచున్నాను

**M 1 48** (1) ఆకాశరాజ సుతయగు నుష కాలదేవతా! యశప్రకాశములచె మాకు సౌభాగ్యసంపదలిచ్చుచు నుదయింపుము సౌభాగ్యము నిమ్ము

(2) దానశీలురగు నుషస్సులు మాకుఁ బశుధనమును నశ్వధనమును నిచ్చుచు దినదినము మము జేరుదురు దేవతలార! రాజులకు దాతృత్వము నేర్పి మాకా దానము నిండు

1 122 (1) దక్షిణయను విశాలరథము సిద్ధమైనది అమర్త్యులగు దైవములు రథమెక్కిరి జనులగృహములను ప్రకాశింపఁజేయుటకై గొప్ప దేవత యంధకారములోనుండి వెలివడినది

(2) ప్రాణికోటి నిద్రలేవకమున్నె వారికిఁగాను నుష కాలదేవత భాగ్యమును సిద్ధపఱచికొని సదాకాలములందును బాలికయయి యందఱినిఁ జూచుచుండును ప్రాతఃకాలారాధనకు నుషస్సే ముఖ్యదేవత

(4) ప్రతిదినమును, నా దేవత తనరూప మగపఱచుచుఁ, బ్రతిగృహా మందును దనప్రకాశము వెదజల్లుచున్నది తళతళమను ప్రకాశమున జయమార్జింప వచ్చుచున్నది సకలదైవములలోను నుషస్సు భాగమునకుఁ జేరిన హవిస్సు మేలైనది

(5) ఆనందదేవతా! భగవరుణుల చెల్లెలా! నుతింపఁబడినవారిలో నీవు మొదటిదానవు చెడుఁగు తలఁచువాని బలము చెడుఁగాత

(6) దూరముగఁ దనప్రకాశము వ్యాపింపఁజేయుచు నుషస్సు, రాత్రి దేవత దాఁచినధనము నగపడఁజేయుచున్నది

(7) అహోరాత్రములు వేఱువేఱు రంగులుగలిగి యొకరినొకరు వెంబడించుచు నొకరు వెళ్లగనె మఱియొకరు వచ్చుచున్నారు,

ప్రకాశమును దెచ్చుచున్నది ఆ ప్రకాశమును భూమ్యాకాశములు నించినది

M 7 75 [1] ఉషస్సు స్వర్గమున పుట్టి ప్రకాశించుచున్నది ఋతువిధి ననుసరించి తన గాంభీర్యమును జూపుచున్నది రాక్షసులను నంధకారమును బోదోలినది జ్ఞానులగు నాంగిరసులా దేవతయొక్క మార్గము జక్క బఱచినారు

[2] ఈ దినము సకల సంపద్యుక్తులగునట్లు మమ్ము వృద్ధినందింపుము సమస్తసుఖము ననుభవించులాగొనర్పుము అనేకవిధ సంపదల నిమ్ము పనులలో యశమువచ్చులాగొనరింపుము

[3] ప్రాత కాలమునందలి ప్రకాశమును జూడుము అనేకవిధములగు చాయలుగలిగి మా సరసను జేరుము అంతరిక్షమెల్లను నిండి పావనాగమ కర్మములొనరింప జేసి యుషస్సులు వెళ్లినారు

[4] దూరమునను దనరథమునెక్కి పంచజాతులు నివసించు స్థళములను దర్శించి మర్త్యులమార్గములను బనులను జూచుచు స్వర్గసుతయును బ్రపంచ చక్రవర్తినియునగు నుషస్సు వెడలినది

[7] సత్యమాడువారిలో సత్యవతిగను, బలవంతులలో బలవంతురాలుగను దైవములలో దేవతగను, పవిత్రులలోను బవిత్రురాలుగను రాజిల్లుమను గంచెలన్నియునుదెంచి గోవులనిచ్చెను ఉషస్సును జూచి గోవులమంద ప్రార్థించుచున్నది

M. I 92 [3] పనిచేయు స్త్రీలబలెను బాటలుపాడుచు, దూరమునుండి తమకు నేర్పడిన మార్గములనుసరించి దానశీలుండగు యజమానునకు నాహార మమర్చుకొని సోమరస మొసంగువానికి సమస్తవస్తువు లిచ్చుచు నుషస్సులు వచ్చుచున్నారు

[4] నటిబలెను గనూదిబట్టలు ధరించినది పొదుగునిండిన యావుంబలె నెదనుబ్బించినది జీవకోటికిని గను ప్రకాశమునృష్టించి, గోవులు గల మంద యొక్క కంచెవాకిలి దెఱచినట్లుల యంధకారమును వదలించినది.

[5] ఉషస్సుయొక్క శోభను మేముచూచినాము నల్లనిదయ్యమును బాఱదోలినది యూపస్తంభమునందలి చాయనుబోలె యుషస్సు తన ప్రకాశమందినది

[6] రాత్రి మేరను మేము దాటితిమి ఉషస్సు జనించి సమస్త వస్తువులు మేముచూచులాగొనర్చెను స్తుతిపాఠకుర లింబలె నవ్వుచు

యశః ప్రకాశదాయినివై సౌందర్యవిలాసములతో మాకు ముదము నిచ్చుటకు లేపుచున్నది

[9] ప్రపంచమెల్లఁ దనచూపులఁజూచుచు ప్రకాశరూపకమగు తన లోచనములు పశ్చిమదిశకు వ్యాపింపఁజేయుచు, జీవకోటికి జలన శక్తి నిచ్చుచు తన్నుఁబూజించుప్రతిమనుజుని ధ్వనిని గుర్తించుచున్నది

[10] పురాతనకాలమునుండియు దినదినముఁ బుట్టుచు నొకవస్త్రమునే సదాధరించుచు, మర్త్యుల యాయువును వెచ్చించుచు, జనుతాకారముఁగల వేటకాఁడు పక్షులయవయవము లొక్కటొక్కటి తఱుగురీతిఁ దఱుగుచున్నది

[11] స్వర్గపుమేరనుఁ జక్కఁగఁగనిపెట్టి తనచెల్లెలను దూరముగఁ దోలుచున్నది మానవుల యాయు కాలముఁ దగ్గించుచు నుషస్సను యువతి తనప్రియుఁడిచ్చిన శోభచే రాజిల్లుచున్నది

10 172 (1) నీ సంపూర్ణసౌందర్యమున రాజిల్లుచురమ్మ గోవులన్నియును జాలుతోనిండిన పొదుగులుగలిగి నీమార్గముగుండ వచ్చుచున్నవి

(2) అనుగ్రహమానసవయి, దానశీలవయి ధర్మాత్ములను గూడికొని, మాచే ఋక్కులు రచింపఁజేయుచురమ్మ

(3) ఉషస్సు తనచెల్లెలయొక్క వెసనమునుఁ గోఁగొట్టుచున్నది గొప్ప గుణముచే జెల్లెలను మఱలఁదనదారి నడుచులాగొనర్చుచున్నది

ఉషస్సులను ఋక్కులనేకములున్నవి వానినెల్ల వ్రాసిననొక గ్రంథము గొప్పదియగును

రాత్రినిగుఱించి ఋగ్వేదమునందొక సూక్తమాత్రమున్నది మిగత ఋక్కులందచటచట రాత్రివిషయము వివరింపఁబడినది ఋషులు రాత్రినెచటను దూషింపరు కొన్నితావుల నుతించినారు

1 35 (1) జీవకోటికినెల్ల విశ్రాంతి నిచ్చు రాత్రిని నే నాహ్వానించెద

1 62 (7) భగదైవ మలసటనంద , స్తుతులసాహాయ్యమున, వియోగమెన్నడును లేని పురాణదంపతుల (భూమ్యాకాశముల) వేఱుపఱచెను ఉన్నత స్వర్గమున నీ మైంద్రజాలికుఁడు కన్యలిరువురిని (అహోరాత్రములు) నుంచెను

(8) నవీనముగ జనించుచుఁ యున్నపిల్లలు ( అహోరాత్రములు ) తమ యిష్టానుసారముగ నటించుచు, వేఱువేఱు వర్ణములుధరించి, జంటలుగఁబుట్టి, నొకరివెంటనొకరు పురాతనకాలమునుండి భూమ్యాకాశ

ముంచుచును దిరుగుచున్నవారు నల్లనియంగములుగలిగి రాత్రియుం బో
ప్రకాశావయవములుగలిగి దినములున్నవి

(10) అనేకరూపములగు పావనాగమవిధులంటి యిరువురక్క చెల్లెండ్రును యజమానునిసరస భార్యలుగనో, తల్లులుగనో నిలుతురు

M 2 38 (3) సవితృదేశమును, రాత్రి కొంపెమును వ్యాపించెను

(4) అదివరలో విడియంబడి చేసిపోయినది మఱల నేయ నారంభించెను

M 10 127 (1) రాత్రిదేవత తన నక్షత్రలోచనములచే నగరప్రదేశములు చూచు చున్నది తనయశోరూపముల ధరించుచున్నది

వాయువుపుట్టెను? ఎచటనుండవచ్చెను? దైవముల ప్రాణవాయువతండు ఈ దైవము తానెచటనుండినను దనయిష్టానుసారము సంచరించుచుండును వానిధ్వని మేమువిందుము వానిరూపముం గనలేము

M 1 135 (3) భర్త, నిద్రపోవుభార్యను లేపినట్లు వాయువు ప్రజలబుద్ధిని ప్రజ్వలింపఁజేయును భూమ్యాకాశములు రజ్జింపఁజేయును ఉష కాల దేవతలను రాగిల్లజేయును

(6) వాయుదేవా! నీవు నలకతోం బ్రథమునుగాయినందున సోమ పానమునకు నీవు ప్రథముండవైతివి

M 4 46 (1) సోమరసములో శ్రేష్ఠమగుభాగ మీ యాగమునిధిలో నీవందుము నీవారంభమున పానము చేయువాడవు

48 (1) ఋషులు తమ శాత్రవులధనమంది సోమరసము సిద్ధపఱచినారు ఎవరు నీకను దాచినంపలేరు నీవుస్వీకరింపుము

M 8 18 (9) పావన రమణగుగాలి మనోహరముగ మాపైకినిమ్ము శాత్రవులం బోఁదోలనిమ్ము

M 10 186 (1) ఆనందారోగ్యములిడి వాయువు తన పరిమళపానము మాలోం జొరునాగానర్చు గాత మాయాయువు హెచ్చింపనుగాత

(2) వాతమా నీవు మాతండ్రివి నిజము మా సోదరుఁడవు స్నేహితుఁడవు మేము జీవించునట్టి బలమునిమ్ము

(3) నీభవనమున నమృతముంప బడినది మాబ్రదుకునకునై దానిలోం గొంతభాగమిమ్ము

సోమరస పరిమళసారముగల వాయువు పవమానమనఁబడును తా పార్థివవాయువులపైఁ బ్రాణమాధారపడినది

ఇఁక మేఘములును మేఘములను గదలించు పర్జన్యమరుత్తులను గుఱించియు రుద్రాది తదధిష్ఠాన దేవతలనుగుఱించియు నించుక వ్రాయఁబూనెద

జలపూరితములగు మేఘములు ఘనీభవించి ఆపడియుండును వానినిఁ

గదలించి మోటికొకటి కొట్టుకొని పగలులాగొనరించి యందున్న జలములను భూమిపై జాఱవిడిచి నలుదిక్కుల వ్యాపింపజేయువారు మరుత్తులు వీరు రుద్రుని కొమారులు రౌద్రస్వభావముగలవారు యోధులు స్వాభావికముగ మరుచ్చలనమున మేఘములకు ఘర్షణమండి యురుములు, మెరుపులుపుట్టి పిడుగులుపడు క్రమమును జూచి యది యంతరిక్షరంగమున జరుగు యుద్ధమని యెంచి ఋషులు తమ యిష్టానుసారముగ వర్ణించినారు వర్షించుటకు కారణం మింద్రుడనకు మరుత్తులు సాహాయ్యులు కారణంబున నింద్రునకు మరుత్తులనుజంటగూర్చి ఋక్కులల్లినారు వర్షమునకు నింద్రశబ్ద సారస్యమున నింద్రు డధికారియనునది సందియమైనను మరుత్తు లవశ్యమనుటకు సందియములేదు గొప్ప పర్వతముపైన గుమిగూడి వ్రాలిన మేఘములను నలుదిక్కులకుదోలి భూమిపై వర్షము గుఱియిలాగొనరించువారు మరుత్తులుకదా, ఆ మరుత్తులను గుఱించిన ఋక్కులుగొన్ని యిచట వ్రాసెద

M 1 64 (2) ఆకాశ వృషభములగు ఘనులు దైవములు రుద్రుని పుత్రులు, మరుత్తులు నిష్కల్మషులయి, సూర్యునివలె ప్రకాశించుచు, సంబలము పావనమొనరించుచు, భయంకర రూపముగలవారయి రాక్షసులబలెనుండి వర్షము గురిపించుచు జనించిరి

(3) రుద్రబాలకులు రాక్షసహంతలు ముదిమిలేనివారు పర్వతములబలె నజేయులయి వృద్ధినందుచున్నవారు తమ శక్తిచే జీవకోటిని వడంకించుచున్నవారు భూమ్యాకాశములందుండు సమర్థులుసైతము వారికి నమ్రులగుదురు

(5) సదా చలించుచు నాకాశగోవుల (మేఘముల) పొదుగులను పిండుచు భూమిచుట్టు తిరిగి భూమిని జాలునించుచున్నారు

(7) అద్భుతశక్తికలవారయి, ప్రకాశాధికతగలిగి, పర్వతములబలె స్వయంభరులయి యతివేగముగ దారి నడుచుచున్నవారు అడవిని నగ్నిగా సంచరించునపుడు మీ శక్తి జూపుచు నేనుగులవలె స్పృష్టములను త్రుంచుచున్నారు

1 37 (7) మరుత్తులారా! మీ రాకగలిగి నయింప నమ్రుండగును మీ యనుగ్రహమట్టిది కాఠిన్యముగల పర్వతములు సైతము చలించును

(9) మరుత్తులు సంచరించుచు మార్గమున మాటలాడుచుందురు వారేమి మాటలాడుచుండియు నెవరైనను విన జాలుదురా?

1 38 (1) అంగ్రడి కొమారుని నాలింగనము చేసికొనినరీతి మిరెప్పుడు నను నాలింగనము చేసికొనియెదరు

(2) ఇపు డెచటికి? స్వర్గమున కెచ్చోటికి బోవుచున్నారు? భూమిపై నిలువరేల? మీ గోవు లెచట మేయును?

(5) గడ్డియుండు నడవిని జేరిన క్రూరమృగమునుంబలె నీ భక్తుండు చూడఁబడఁడు అట్టివాఁడు యమునిమార్గము పట్టఁడు

[6] అజేయములగు మసూచికి బాధలు మమ్మునంట కుండుఁగాత క్షామము మానుండి వెడలిపోవుచుగాత

[9] భూమినంతయు నీరునించుచు నహస్సునసైతం మంధకారము గల్పించి జలపూరిత మేఘములు గప్పుచున్నారు

ఈరీతిగ ననేకఋక్కులున్నవి ఇట్టి యద్భుతశక్తులనుఁజూచి యచ్చెరువంది యవి దైవములని భావించి గౌరవించి స్తుతించుచుండిరి మనమిపు డురుము యొక్క ధ్వనిని విందుము ఉరుమును జూడఁజాలము స్పర్శింపఁజాలము వాసనఁ గనలేము రుచి జూడలేము ఈరీతిగ నుండినను నా శక్తినుండి శబ్దము వచ్చుచున్నది అది వినఁబడుచున్నది కారణమేమి? ఎచటనుండి వచ్చును? ఎవరినుండి వచ్చును? ఈ విషయము విమర్శనీయమయ్యెను, అడవిని బోవునపుడు ఘర్జారావ మొకనికి వినఁబడును అపుడేదో ఘర్జించు శక్తియొకటి యుండవలెనని యాలోచించి విమర్శించి చూచి యా ధ్వని సింహమునుండి పుట్టినదని తెలిసికొనుట సాధ్యమాయెను ఉరుముయొక్క ధ్వని వినబడెనుగాని యది యెవరినుండి పుట్టినది కనుటకుఁ బ్రారంభమున నార్యులకుఁ దోఁపక యది యొక దైవశక్తియని భావించిరి ఆ దైవశక్తికి "రుద్ర" యని నామమిడిరి ఎపుడా శబ్దము రుద్రునుండి వచ్చెనని మనకు నమ్మికకలిగెనో యపుడే యా రుద్రశక్తికి పిడుగే యాయుధమని కల్పించిరి ధనుర్బాణములు కలవాడని నమ్మిరి శివప, దుర్మార్గులను శిక్షించుటకును సన్మార్గులను రక్షించుటకును నగిధరించెనని నిర్ధరించిరి ఉఱిమినవెంటనె వానకురిసి దేశము సుభిక్షమగుటచే ప్రజలను రక్షించువాఁడనియు ఔషధములనిచ్చువాఁడనియు బిరుదులిచ్చిరి మొలకయెత్తి యాకులువిడిచినఁ ఔషధ వృక్షమగుట కష్టము కాదుకదా? ఈరీతిగ నార్యులచె నూహింపబడిన రుద్రుఁడు పురాణయుగమునఁ ద్రిమూర్తులలో నొక్కఁడయి వెదగడిత దైవములను మూలఁ గూర్చుండబెట్టెను రుద్రునిగుఱించి ఋగ్వేదములోఁ బలుకఁబడిన ఋక్కులలోఁ గొన్ని వ్రాసెద

M 1 43 [4] ఆగమ విధులకును, ఋక్కులకును, ఔషధులకును, స్వామియగు రుద్రునిగుఱించి యాయురారోగ్యబలములకునై మేము నుతించుచున్నాము

M 1. 114 [5] జటలుధరించి కపర్దియని నామమందినట్టియు నాకాశమున నెఱ్ఱఁగఁ బ్రకాశించు నడవిపందిగఁ జరించునట్టియు, రుద్రుని గౌరవబుద్ధినిఁ బిలుచుచున్నాము శ్రేష్ఠతమమగు నౌషధముల చేతనుంచికొని

మాకు రక్షయు నీడయు భద్రమగు భవనమును నిచ్చుచుండును గాత

[7] రుద్రా! చిన్నవారిని గాని పెద్దవారినిఁగాని బాధింపకు పెరుగు నట్టి పిల్లలనుగాని ముసలివారినిఁగాని తొందరపెట్టకు తండ్రులను గాని తల్లులను గాని చంపకు మాకుఁ బ్రియములగు శరీరముల కేబాధయు గలిగింపకు

M 2 33 [1] మరుత్తులతండ్రీ! నీ యనుగ్రహము మము సమీపింపనిమ్ము సూర్య దర్శనమునుండి మముఁ దప్పింపకుము

[2] నీవిచ్చు సిద్ధౌషధములనుండి మేము శత హేమంతఋతువులు జీవింతుముగాత, శాత్రవభావమును, నసహ్యతయు మానుండి పాఱఁదోలుము ఆధివ్యాధులు దిక్కునకొకటి పోనిమ్ము

(3) పుట్టుగలవారికి స్వామివయి, రుద్రా! నీవు యశ ప్రకాశుఁడవైతివి పిడుగు నాయుధముగఁగొని బలవంతులలో బలవంతుఁడవైతివి మా బాధలను బోఁగొట్టి సేమమొసఁగుము అపాయములు మానుండి దోలఁపుము

(4) పుష్టిమందులొసంగి మాశూరులకు బలమునిమ్ము వైద్యులలో నీవు శ్రేష్ఠుఁడవని నేనువిన్నాను

(13) మరుత్తులారా! స్వచ్ఛమగు మీమందులలో రుచ్యమైనట్టియు నారోగ్యకరమైనట్టియు మాతండ్రియగు మనువువలన నేర్పఱుపఁ బడినట్టియు మందులను మా లాభసుఖములకుఁగాను రుద్రుఁ డిచ్చునుఁగాత

M. 7. 46 (2) మాకుటుంబ రోగములన్నియును రుద్రా! మాన్పుము.

పైరీతిగ రుద్రుని దైవముగఁ బొగడుటయగాక మంచివైద్యుఁడని పలికినారు

M 7 59 (12) ఈఋక్కులో నేత్రత్రయోపేతమని వర్ణింపఁబడినది కావునఁ బురాణ యుగములోని త్రిమూర్తులలో నొకఁడైన రుద్రుఁ డిదైవమనుటకు సందియము లేదు

శుక్ల యజుర్వేదములో (16) రుద్రునకిపుడు పురాణములందుఁగల నామములు విశేషములు పలుకఁబడినవి రుద్రుఁడొక ముఖ్యదైవమనుసూచన యప్పుడే యగపడుచున్నది ఋగ్వేదములో, పైన వ్రాయఁబడినరీతిగ మరుత్తుల తండ్రియనియు ఘర్జారావమునిచ్చు పిడుగనియు భిషగ్వరుఁడనియు చెప్పఁబడినది కాని యంతకంటె హెచ్చేమియును లేదు శుక్లయజుర్వేదములో మేఘనాథుఁడని పలుకుచు రుద్రుఁడు భయంకరమూర్తియనియు దొంగలు మొదలగువారి దై

మనియు లయాధికారియనియు పలుకఁబడనాడు తామ్రారుణ బభ్రు ర్ణుఁడని మేఘచ్ఛాయలనుబట్టి నామములిడినారు ఆకారణంబుననే నీలకంఠయని పిలువఁ బడుచున్నవాఁడు వాన గురిపించుటచేఁ బశువులను గాపాడువాఁడు కావున పశుపతియని బిరుదుగలిగినది రుద్రుడొనరించు కార్యమునుండి లోకమునకు మేలు కలుగుచుండును కావున శంకర శివయనునామములు వచ్చినవి సూక్తములోఁగాని బ్రాహ్మణములోఁగాని రుద్రునిభార్యలు కాళి దుర్గలని పలుకఁబడలేదు కౌషీతకి బ్రాహ్మణములో నొకచోటమాత్ర మీ శానమహాదేవులకుఁ బ్రాముఖ్య మివ్వఁ బడినది శతపథ బ్రాహ్మణములో రుద్రా! ఇది నీభాగపుహవిస్సు అనుగ్రహించి నీచెల్లెలగు నంబికతోవచ్చి దీనిని స్వీకరింపుమని పలుకఁబడినది (2 6 2 9) కేనోపనిషత్తులో సుమాహైమవతీయను శ్రీదైవము ఇంద్రునకు బ్రహ్మమును గురించి బోధించెనని పలుకఁబడినది

ఇక ఋగ్వేదమునందుఁ బర్జన్యుఁడు దైవముగ నుతింపఁబడినాఁడు ఆ ఋక్కులుగొన్ని యిచట వ్రాసెద

M 5 83 [1] పర్జన్యుఁడు అంకెవేయు పిడుగుంబలె ధ్వనించుచుఁ, దనబహుమతు లతిత్వరితముగఁ బంపుచు, నోషధుల బీజము లుద్భవించుటకై నాటుచున్నవాఁడు

[2] చెట్లు దూరదూరములుగ నుండులాగునఁ గొట్టుచున్నవాఁడు రాక్షసులను జంపుచున్నవాఁడు భయంకరాయుధములుగల పర్జన్యునకు జీవకోటి భయపడుచుండను ఉఱిమెడు పర్జన్యుఁడు దుర్మార్గులను గొట్టినపుడు, పుణ్యమూర్తులుసైతము భీతిలి వణకుదురు

[3] నీరునించిన మేఘములతో నాకాశమున పర్జన్యుఁడు గప్పినపుడు దూరమున సింహగర్జన లగుచున్నవి

[4] మారుతములు వెనువెంటనె దుముకులాడును వానివెంటనె మెఱుపులుదిగును ఓషధులు మొలచును దిక్కులు ప్రకాశించును పర్జన్యుడు భూమినిఁ దడిపినతోడనె జీవకోటికెల్ల నాహారము పుట్టును

[5] పర్జన్యా! గొప్పపాత్రనెత్తుము నీరుఁజల్లుము ప్రవాహములడ్డులేక పాఱనిమ్ము భూమ్యాకాశములను గొవ్వునఁ దడుపుము గోవులకు నీరు సమృద్ధిగనుండనిమ్ము

పైరీతిగ ఋషిధర్మము ననుసరించి ప్రకృతి మహిమలచేఁ గలుగు వర్షాగమములకు ననేకశక్తులను గలిగించి వానికి నామకరణంబు లొనరించి యార్యులు గౌరవబుద్ధిని వానిని నుతించుచుండిరి పురాతన జనులందఱీరీతిఁ బ్రకృతి సాంబంధిక శక్తులనుఁ బ్రార్థించుచుండిరనుటకు సాదృశ్యము లనేకములుగలవు